




# మహిళలు

## విలువ,ధర్మాలు

## అమ్మ





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్థం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో సాధకులు,జిజ్ఞాసువులు **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు.వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అమ్మ

## సంకలనం

మదర్స్ డే సందర్భంగా

... మే 2008 ...




సంపాదకుడు

**జాన్ హైడ్ కనుమూరి**

# ఇందులో...



**గమనిక :**

ఇందులోని అభిప్రాయాలు, రచనా శైలి, రచయితల, కవుల, బ్లాగర్ల వారి వారి వ్యక్తిగతమైనవిగా గమనించగలరు.

ఫొటోలు : ఫ్లికర్.కామ్, బెటర్‌ఫొటో.కామ్, బ్లాగర్ల టపాలనుండి తీసుకొనడమైనది.
నా దృష్టికి వచ్చిన బ్లాగులనుండి, నాకు వేగు పంపినవి, అదే సమయంలో పత్రికలలో వచ్చినవి సంకలనంలోకి తీసుకోవడం జరిగింది. ఎవరివైనా ఇందులో చేర్చలేకపోతే నాకు వేగుద్వారా తెలియలేదని గమనించగలరు.

సాహిత్యాభిరుచితో ఈ సంకలనం చేసాను. **వ్యాపారాత్మకం కాదు, పూర్తి ఉచితం.**

. . . సంపాదకుడు



# ఓ మాట

అమ్మంటే ఓ అద్భుతం
అమ్మంటే ఓ అపురూపం
అమ్మంటే ఓ అద్భుతకావ్యం
మురిపాలు, జ్ఞాపకాలు
లాలిపాటలు, గోరుముద్దలు
అక్షరాలు, ఆలింగనాలు
నడక, నడత
అనురాగాలు ఆత్మీయతలు
ఆనంద సమయాలు
కన్నీళ్లను వర్షించే క్షణాలు
ఇంకా...
అందమైన అనుబంధం
అంతేలేని అనురాగం
వెరసి
మరపురాని జ్ఞాపకం



అమ్మతో అనుబంధంలేని జీవితం ఉండదు. ప్రతీ సమయంలోనో, ఏదొక సందర్భంలోనో గుర్తుచేసుకొనే తియ్యటి జంటితేనె అమ్మ. అమ్మ గురించి ఏమిరాయాలనే సందేహం కలిగినవాళ్లు వున్నారు. పూర్తి వ్యక్తిగతాన్ని అమ్మకోసం మన ముందు పరిచినవారున్నారు. జ్ఞాపకాల పొరల్లోంచో, అనుభూతుల గుత్తుల్లోంచో, గుండెల్లో దాచిన అల్మారాల్లోంచో "అమ్మా! నిన్ను ప్రేమిస్తున్నాను" అని చెప్పడంలోని ఆనందం మాటలలో వివరించలేనిది.

అమ్మ గురించి ఎవరెవరు ఎలా స్పందించినా, ఆ అక్షరాలను మాలలుగా గుచ్చి అందివ్వాలని అనిపించింది. "మదర్స్ డే" కలిసివచ్చింది. ఈ చిన్ని ప్రయత్నానికి స్పందించి టపాలు రాసినవారికి అభినందనలు. టపాలు చదివిన వారికి మరిన్ని అభినందనలు.

నిజానికి సంకలనంగా చెయ్యాలి అనే ఆలోచనలను బ్లాగులో పెట్టినప్పుడు పెద్ద కష్టమైన పని అనుకోలేదు. కొందరి వ్యక్తిగతమైన

# ఓ మాట

టపాలను చదివినప్పుడు కొద్దిగా కంగారు పడ్డాను. ఎందుకంటే మరీ వ్యక్తిగతంగా టపాలుంటాయనుకోలేదు. మనసు చలించింది. కొద్దిగా వచ్చిన టపాల స్పందనచూసి మానేద్దాము అనుకున్నాను, కాని కొన్ని ఆచరాణాత్మకమైన, ఆలోచింపదగిన విషయాల దృష్టితో పరిస్థితులను గమనించినప్పుడు తిరిగి కొనసాగించాను. సంకలనంగా చదివినవారికి అమ్మంటే అద్భుతమైన రూపం వారి మనోఃఫలకంపై కలగాలని చిన్న ఆశ నాది. కూర్చటంలో ఎటువంటి ప్రతిఫలం వచ్చిందో పాఠకులే చెప్పాలి.

ఈ సంకలనం ఆలోచన మొదలు పెట్టినప్పటినుండి అమ్మ నన్ను వెంటాడుతూనేవుంది. బ్లాగుల్లో చదివి, టైపుచేస్తూ చదివి, ప్రూఫ్ కోసంచదివి, వరుస క్రమంకోసం చదివి ... ఇలా చాలా సార్లు చదివి నాకూ మా అమ్మ గురించి రాయాలనిపిస్తుంది, కానీ రాయలేకపోతున్నాను. ఓ ముప్పై అయిదు సంవత్సరాల అనుబంధం తెరలు తెరలుగా కళ్ళెదుట కమ్ముకొస్తుంది. తొలకరి చినుకుల్లా తడిపేస్తూ, తడిసిన మట్టిపరిమళం నన్ను చుట్టేస్తుంది. జ్యోతి లేవనెత్తిన ఆలోచనలు, ఒకరి టపాలతో ప్రేరణతో మరొకరు రాసిన అమ్మతనపు జ్ఞాపకాల దొంతరలు, అంతర్లీనంగా వాటివెనుక దాగిన సామాజిక, జీవన సరళులు.

ఇక్కడ నా చిన్నతనంలో చదివిన పద్యంలోని వచనాలు గుర్తుకొస్తున్నాయి. “జనజీవనం వస్తూవుంటుంది, పోతూవుంటుంది నేను ప్రవహిస్తూనే వుంటాను”అని నది చెప్తున్నట్టు కవి వర్ణిస్తాడు.

వ్యక్తిగా అమ్మ అనుబంధం ఎవరికివారికి వ్యక్తిగతంగానే అనిపించినా అంతర్లీనంగా దాగిన అమ్మతనపు ప్రవాహం నిరంతరం ప్రవహిస్తునే వుంటుంది. వ్యక్తులనుంచి సమాజంలోకి, సమాజంలోంచి సమూహాల్లోకి ప్రవహిస్తూనే చరిత్రగా మారుతుంది. ఆ చరిత్రలో మనమూ భాగస్వాములుగా మారటానికి ఉన్నతమైన అమ్మతనంతో నింపుదాం.

ఇది రాస్తున్న సమయంలో పిల్లలకోసం గర్భందాల్చిన అసాధారణ పురుషుడు అనే వార్తలు టీవిలలో ప్రసారమవుతున్నాయి. అమ్మతనపు విశిష్టతకు ఇంతకన్నా ఉదాహరణ ఏమికావాలి?

కొన్ని సాంకేతికమైన కారణాలవల్ల అనుకున్న సమయం కంటే జాప్యంజరిగింది, మన్నించాలి.

... సంపాదకుడు

కవిత

# అమ్మ!

కవి'రాజు'





భూదేవికి
మా అమ్మంటే
ఎంత భక్తో!
వేకువనే
అమ్మ పూజకు
ఉదకం పంపుతుంది
పువ్వులు పంపుతుంది
పండ్లు పంపుతుంది.

ఆమెకు
సహనం నేర్పింది
అమ్మే కదా!

**అంతర్నేత్రం విచ్చుకుంటే**
**అణువణువులో అమ్మలాలిపాట వినిపిస్తుంది**
**అమ్మవడిలో తూగుతున్న**
**అనంత కవిత్వం వినిపిస్తుంది**



శ్రీ నాగేశ్వరి కవిరాజు అక్షరాలయం
సంగీత్ నగర్, కూకట్‌పల్లి, హైదరాబాదు
ఫోను : 040-23066444




# అమ్మగురించి ఆలోచించండి!



జ్యోతి వలబోజు

కార్యేషు దాసి
కరణేషు మంత్రి
భోజ్యేషు మాతా
శయనేషు రంభ

ఇలా ఉండాలని ప్రతి అమ్మాయికి నేర్పిస్తారు. ప్రతి ఆడపిల్ల పెళ్ళికాకముందు హాయిగా చీకుచింతా లేకుండా, చదువు, స్నేహితులతో సరదాగా ఉంటుంది. కాని పెళ్ళికాగానే తనంతట తానుగా అమ్మలా మారుతుంది లేదా మారడానికి ప్రయత్నం మొదలుపెడుతుంది స్త్రీ. అత్తవారింటికొచ్చాక కొత్తగా ఆంక్షలు, పద్ధతులు కూడా మొదలౌతాయి. ఐనా అనుభవం మీద ఒకొక్కటిగా భర్త సహకారంతో నేర్చుకుంటుంది. అత్తమామలకు, భర్త, పిల్లలకు కావలసినవి అమర్చిపెట్టడం, బంధువులతో మర్యాదగా ఉండటం ఇలా ఎన్నో బాధ్యతలతో సతమతమవుతుంది. తనకంటు కొన్నికోరికలు, ఆశలు ఉంటాయని ఎవరైనా ఆలోచిస్తారా? తన కాలనీలో చీరలమ్మేవాడు వస్తే అందరు చీరలుకొనుక్కున్నారు. తను ఉద్యోగం చేయట్లేదు కాబట్టి స్వతంత్రించి కొనుక్కోలేదు. ఇంటిఖర్చులకోసం భర్త ఇచ్చిన డబ్బులలో నుండి కొనుక్కోవచ్చు, కాని అది తన స్వంతంకాదు. ఖర్చుపెడితే దాని లెక్కచెప్పాలి లేదా భర్తను అడగాలి. అందరికీ అన్నీ అమర్చిపెడుతున్నా తనకంటూ స్వంత డబ్బు ఉండదు. అది భర్తదో, కొడుకుదో, కూతురిదో అవుతుంది. గాని వాళ్ళు ఇస్తేనే తప్ప తన కిష్టమైనది కొనుక్కోలేదు. ఇంటిపనులుచేసి ఉద్యోగంకూడా చేయాలంటే కష్టం.

పెళ్ళై. పిల్లలు వాళ్ల పెంపకం, చదువులు, ఉద్యోగాలు, పెళ్ళిళ్లు ఇలా బాధ్యతలు పెరుగుతూనే ఉంటాయి. ఈ పరిణామంలో తన ఉనికినే కోల్పోతుంది స్త్రీ. తనకు ఏదిష్టం, ఏది తనకు నిజమైన సంతృప్తినిస్తుంది అనే విషయాలు. ఎప్పుడూ భర్తకు కావలసినవి, పిల్లలకు నచ్చినవి చేయడం అనే ఆలోచనలే. ఈ రోజుల్లో చాలామంది ఉద్యోగాలు చేస్తున్నారు, కుట్లు, అల్లికలు మొదలగునవి చేసి తమకంటూ ఆదాయం ఏర్పరచుకుంటున్నారు. కాని అవి కుటుంబ నిర్వహణకు, పిల్లలఖర్చులకు సరిపోతున్నాయి. సరేలే భార్య ఎంత కష్టపడినా కుటుంబ ఆదాయానికి కదా అని భర్తలు ప్రోత్సాహిస్తున్నారు. ఈ క్రమమంలో మాత్రం ఆమె తన కుటుంబనిర్వహణలో ఏ చిన్న పొరపాటు జరిగినా ఊరుకోరు. తమను దాటి పోనివ్వరు భర్తలు. పాతకాలంలో ఆడవాళ్లని ఎప్పుడూ మగాడి వెనకాలే ఉండేలా చేసేవాళ్లు.

# అమ్మగురించి ఆలోచించండి!

జ్యోతి వలబోజు




ఇప్పుడు కనీసం తమతో సమానంగా ఉండేలా ఒప్పుకుంటున్నారు కాని తమను దాటి ఒక్కడగు కూడా ముందుకు పడనివ్వరు. అయినా స్త్రీలు సహనంతో రెండు బాధ్యతలు సమర్థవంతంగానే నిర్వహించ గలుగుతున్నారు. ఎవ్వరిని నొప్పించక తాన్వొక అన్నట్లు.

నిజంగా అమ్మచేసే పనులన్నీ మీరు చేయగలరా? ఇక్కడ అమ్మంటే ఇల్లాలు. ఒక్కసారి కనీసం మూడురోజులు అమ్మస్థానంలోకి వెళ్ళి ఆవిడచేసే పనులన్నీ మీరుచేయగలరా ప్రయత్నించండి. లేదా కనీసం ఒక్కరోజు చెప్పడంకాదు చేయాలి. అలాగే ఉద్యోగంచేస్తూ ఇంటిపనులు సమర్థవంతంగా చేయగలరా అందరు మగవాళ్ళు. మరి అలాంటప్పుడు స్త్రీని ఎందుకు తప్పులు ఎత్తిచూపుతారు? అంటే భార్య(అమ్మ)ఉన్నది ఇంటిపని చేయడానికేనా? పెళ్ళి అయినప్పటినుండి కుటుంబంకోసం ఇంత కష్టపడుతుంది కదా! అని ఒక్కసారైనా అనుకున్నారా? లేదు ఆవిడ ఉన్నది ఆ పనులు చేయడానికే అని అనుకుంటున్నారా? పిల్లలకు చేయాలి, మళ్ళీ వాళ్ళపిల్లలకు చేయాలి. కానీ అవన్నీ తను సంతోషంతో చేస్తుంది. కాని ఒక్కసారైనా అమ్మకు ఏదంటే ఇష్టం, ఏ స్వీటు అంటే చాలా ఇష్టం, ఏ పుస్తకం చదవాలనుకుంటుందో, ఏదైనా నేర్చుకోవాలనుకుని మానేసిందో తెలుసా? తనకు తెలిసిన వాళ్ళెవరికైనా సహాయంచేయాలని చేయలేకపోయిందా! ఆడది కదా ఓ చీరో, ఓ నగో ఇస్తే సంతోషిస్తుందిలే అనుకుంటున్నారు కదా! కానీ వాటికంటే ఆమెకు చాలా ఇష్టమైనది ఏదో వుంటుంది. ఆ పనిచేస్తే(డబ్బులు రాకున్నా) ఆమెకు నిజమైన సంతృప్తి కలుగుతుందేమో. ఇప్పటికైనా కనుక్కోండి. అది ఆమెను చేయమని ప్రోత్సాహించండి. తల్లిగా, భార్యగా తన బాధ్యతలతోపాటు తనకంటూ ఒక జీవితం, ఒక లక్ష్యం సృష్టించుకోనివ్వండి. అప్పుడు ఇంకా ఉత్సాహంతో ఉంటుంది.

అందుకే ఒక్కసారి అమ్మగురించి ఆలోచించండి "అమ్మా నీకు ఏమిష్టం"
నేను చెప్పాలుకున్న మరికొన్ని విషయాలు వసుందరలో చూడండి.

నేటి తరానికి ఈ టపా నచ్చకపోవచ్చు ఇది నా తరానికి, నా ముందు తరానికి చెందిన వాస్తవాలు. ఇలాంటి ప్రాణమిచ్చే అమ్మలు ఎందరో ఉన్నారు. లేనివాడు కోట్లన్నా బిచ్చగాడే, పైసా లేకున్నా కోటీశ్వరుడే.

ఏమిచేయాలో తెలియని అయోమయంలో ఉన్న నాకు "నీకంటూ ఒక జీవితం సృష్టించుకో నీ కిష్టమైనవి చేయి"అని నా ఆలోచనా విధానాన్ని మార్చిన స్నేహితునికి మనః పూర్వక సుమాంజలి.



http://jyothivalaboju.blogspot.com/2008/02/blog-post_29.html

కవిత

# నేను ... అమ్మ

జాన్ హైడ్ కనుమూరి



రోడ్డుపై నేను ... అమ్మ
అప్పుడే
చీకటి పులుముకుంటోంది
చలి మెల్లగా పంజా విసరుతోంది
శాలువా కప్పుకున్న అమ్మ
నడుస్తున్నాం ఇద్దరం
దూరం తెలియకుండా
ఏవో చెబుతోంది అమ్మ
నేడు
అదే దూరం
అదే రోడ్డు
అదే చలి
చెంత అమ్మలేదు
అయినా...
ఆన్నో సంగతులు
నన్ను కప్పేవున్నాయి
శాలువాలా.



కవిత

# కామధేనువు

టి. జ్ఞానప్రసూన



అమ్మా!
ఇంపైన చీరకట్టి
నిన్ను ఇంద్రధనస్సులో కూచోబెట్టి
తామరపూల మాలవేసి
తారలతో అలంకరించాలనివుంది
అమ్మా!
నీతో నా అనుభవాల్ని
నెమరువేస్తూ ఆక్షణంలో
నీరూపం మనఃపటలంపై చూసుకొంటూ
మైమరచి పోవాలనివుంది
అమ్మా!
నువ్వు మాకోసం
ఎంతచేసావో, ఏమిచేసావో
గొప్ప కవికంటే గొప్పగా
ఎలుగెత్తి చెప్పాలనివుంది
అమ్మా!
నువ్వు చందమామవి
చనుబాలిచ్చిన కామధేనువువి
చూపులతో పోషించిన చైతన్యానివి
నీ ఒడిలో దాక్కోవాలనివుంది.

కవిత

# అమ్మ ఎప్పుడూ అంతే...

పూడి శ్రీనివాసరావు



నన్ను గెలిపించడానికి తను ఓడిపోతుంది
అలా ఓడిపోవడమే గెలుపనుకుంటుంది
అమ్మ ఎప్పుడూ అంతే!

ఒకసారి నన్ను కొట్టింది
అరచేయి ఆనవాళ్లు పడేలా కొట్టింది
అయినా ఏం లాభం?
నా కంటేముందే ఏడ్చింది!
నేను గుక్కపెట్టి ఏడ్చేలోపే
గుండెల్లోకి లాక్కుంది
తెరలు తెరలుగా
తన కౌగిళ్ళతో కప్పుకుంది
కళ్ళే కాదు.. తనువులోని
ప్రతి అణువు చెమరించేలా ఏడ్చింది!



'ఇంకెప్పుడూ అమ్మకు కోపం తెప్పించకూ! అంటూ
నను బహిరంగంగా బతిమాలింది
నా గెడ్డం పట్టుకొని... అటూ ఇటూ లాలిస్తూ
'నా బంగారుకొండ..ఇంకెప్పుడూ అలా చేయదు'అని
నా ఒట్టుకూడా తనే పెట్టుకుంది
అంతటితో ఆగిందా?
'పాపిష్ఠిదాన్ని..ఈ చేతుల్తో ఎంత దెబ్బకొట్టాను..!'అంటూ
నా చేతులతో తన లెంపలు వాయించుకుంది

అమ్మ ఎప్పుడూ అంతే!
నన్ను గెలిపించడానికి తను ఓడిపోతుంది
అలా ఓడిపోవడమే గెలుపనుకుంటుంది

నేను ఎదిగాక కొట్టడం మానేసింది
ఈ సారి నాన్నకు అందేవి ఫిర్యాదులు
అప్పుడైనా గెలుస్తుందా?
వెయ్యి భరించాక ఒక్కటి చెబుతుంది

11.5.2008 వార్త, ఆదివారం నుంచి

కవిత

# అమ్మ ఎప్పుడూ అంతే...

పూడి శ్రీనివాసరావు

పుట : 2



కోపం ఉండదు..నేనేమైపోతాననే భయం!
ఆయనగారికి వళ్లుమండి నాలుగు తగిలిస్తారు
ఐదో దెబ్బపడకుండా సరిగ్గా మధ్యలో నిలబడిపోతుంది
ఒక్కోసారి ఆదెబ్బ అమ్మకే పడిపోతుంది
అయినా... నా వీపుకు వెన్నపూస రాయడం
నా బదులు తను ఏడ్వడం
'ఏదో మాటలతో భయం చెప్పక..' అంటూ
నాన్నపై కన్నీళ్లతో ఎదురుదాడి చేయడం
'నా మాటవింటే ఇంతవరకు వచ్చేదా కన్నా..
చూడు వీపు ఎలా కందిపోయిందో!'
నాకు బుజ్జగింపులు, క్షమాపణలు...

అమ్మ ఎప్పుడూ అంతే!
నన్ను గెలిపించడానికి తను ఓడిపోతుంది
అలా ఓడిపోవడమే గెలుపనుకుంటుంది

పెళ్లిచేసి నాకో జీవితాన్ని ఇచ్చాననే సంతోషంలో
ఒక్క ఆనందభాష్పమైనా రాల్చలేదు
బాధ్యత తీరినందుకు బాధపడే ప్రేమ ఆమెది
ఇల్లుమారాక ఎంత బాధపెట్టాను?
ఏమైనా పంతం నెగ్గించుకుందా

నా కడుపు పండిందనే వార్తతెలిసి
పండగొచ్చినంత ఆనందించింది
నా కడుపులోవున్న బిడ్డకంటే
క్షేమంగా చూసుకుంది నన్ను
అప్పుడు నాతో కలిపి ఆమెకు
మళ్లీ ఇద్దరు పసివాళ్లు
నా బిడ్డకు రూపురేఖలుదిద్దే
నా చేదికందించే క్షణాన
మళ్లీ అమ్మ కళ్లుచెమ్మగిల్లుతాయి
గతమంతా ప్రేమతో తుడిచేసి



11.5.2008 వార్త, ఆదివారం నుంచి

కవిత

# అమ్మ ఎప్పుడూ అంతే...

పూడి శ్రీనివాసరావు

పుట : 3



'చంటోడు జాగ్రత్త' అంటుంది!

అమ్మ ఎప్పుడూ అంతే!
నన్ను గెలిపించడానికి తను ఓడిపోతుంది
అలా ఓడిపోవడమే గెలుపనుకుంటుంది

నా మాటలు ఆ మనసును మెలిపెట్టినప్పుడు
అప్పుడప్పుడూ అలుగుతుంది
అక్కడైనా గెలుస్తుందా?
చంటోడికి బారసాలకో
గోరుముద్దల పలుకులకో
ఇట్టే మెత్తబడిపోతుంది
ఆమె గుండె లయను కూడా
నా క్షేమంతో అనుసంధానంచేసి వింటుంది

అమ్మ ఎప్పుడూ అంతే!
నన్ను గెలిపించడానికి తను ఓడిపోతుంది
అలా ఓడిపోవడమే గెలుపనుకుంటుంది

ఈ రోజు 'అమ్మ'పండుగ
పసితనంలో ఆమె చెంపలు వాయించిన
చేతులు వెనక్కి తీసుకోలేకపోయినా
నన్ను తప్పించబోయి నాన్నచేతిలో తిన్నదెబ్బకు
మందు పూయలేకపోయినా
అమ్మను గెలిపిస్తాను అమ్మా! అని పిలుస్తాను
అలక తీరుస్తాను
ఆమె పక్కనేకూర్చుని కసేపు మాట్లాడుతాను
ఆరోగ్యం ఎలావుందమ్మా అని అడుగుతాను
అమ్మే గెలుస్తుంది
గెలిచి నన్ను గెలిపిస్తుంది



11.5.2008 వార్త, ఆదివారం నుంచి

పద్యం

# అమ్మ అమృతమూర్తి

శ్రీ రాఘవ కిరణ్ ముక్కు



ఆ.వె. అమ్మ జోలపాట, అమ్మ చల్లనిచూపు
అమ్మ మృదుల స్పర్శ, అమ్మ మాట
అమ్మచేతి బువ్వ అమృతపునిలయముల్
అమ్మ అమృతమూర్తి, అమృత మమ్మ.

కం. నవమాసంబులు కడుపున
నివసంబును, పోషణమును నిర్భీతస్థితిన్
పవమానపంచకము, ధా
తువుల నిడు జననిని దలతు తొలిదైవముగా.

తే.గీ. అమ్మ! నిను మించు దైవత మవనిలోన
లేదు, వాత్సల్యమున నీకులేదు సాటి,
ఋణము నేమిచ్చి తీర్తును? తీర్చలేను,
చేతులెత్తి వందనములు సేతునమ్మ.

మధ్యాక్కర, శరదాంశతాదికాయువును, శతమాన సౌభాగ్యములను,
నిరతమౌ నారోగ్యంబును, ననుతరమా నీ భక్తి, ముక్తి
కరుణను మా యమ్మకిచ్చి కాపాడు కలకాల మీవు
కరధృతకోదండమూర్తి! కమనీయ కళ్యాణరామ!

*ఈ పద్యాలు వ్రాయడానికి ప్రేరణ నిచ్చింది*
*జాన్ హైడ్ గారి అమ్మ-బ్లాగు సంకలనం*




# మా అమ్మ !

'గడ్డిపూలు' సుజాత

అమ్మ జ్ఞాపకాలంటే, మధుర జ్ఞాపకాలే! అమ్మకి భక్తి-వైరాగ్యం చిన్నప్పటి నుంచీ ఎక్కువే. ఎప్పుడూ పూజ, పునస్కారం, అగరొత్తులు, ధూపం. అందుకే అమ్మచీరంతా అగరొత్తుల వాసన. మా పెద్దమ్మలందరి దగ్గరా ఇదే వాసన. అమ్మని కౌగలించుకుంటే ఒక అమ్మవాసన వస్తుంది. అది అమ్మ చిన్నప్పటినుంచీ వాడే పాండ్స్ కోల్డ్‌క్రీం, మైసూర్‌సాన్డల్ సబ్బు. మద్యాహ్నం అయితే ఇంగువా, అగరొత్తులూ కలిసిన వాసన. సాయంత్రం అయితే ఇంగువ బదులు సంపెంగలో, మల్లెలో, సన్నజాజులో, విరజాజులో ఆ కమ్మని అమ్మవాసనలో చేతులు (పరిమళం) కలిపేవి.

అమ్మ పెద్ద జడ నేను ముందుకు వేసుకుని నా జడ అని ఆడుకోవడం, మీసాలుపెట్టడం, అమ్మ వంటచేసినా, దుమ్ము దులిపినా అదేదో దృశ్యకావ్యంలా చూడడం, అమ్మచేత 'గలివర్', 'రిప్‌వాన్ విన్కిల్', 'సిందిరిలా' పాఠాలు కథలుగా చెప్పించుకోవడం. మట్టిలో ఆడినప్పుడల్లా తిట్లుతినడం – ఇవన్నీ మధుర జ్ఞాపకాలే. భక్తిని కూడా తప్పకుండా మా బుర్రల్లోకి డిఫాల్ట్‌గా ఎక్కించేసింది. అయితే... ఎప్పుడూ పూజలో కూర్చోవాలంటే విసుగే మాకు. అయినా ఒకవేళ కూర్చుంటే మాత్రం చక్కగా స్తోత్రాలు చదువుకోగలం.

తను పూర్తిగా సాంప్రదాయవాది. అయినా తన భావాల్లో, అందరు ఆడపిల్లల తల్లుల్లానే అభ్యుదయవాదం కూడా ఎక్కువ. జీవితంలో ఏది కావాలంటే అది దేవుడు ఇవ్వలేడు. చాలావాటిల్ని మనమే కష్టపడి సాధించుకోవాలి. కానీ అమ్మమాత్రం ఏమైనా... ఏమైపోయినా.. ఎలాగైనా.. ఎప్పుడైనా.. ఎక్కడైనా.. మనకు సహాయపడడమే తన జీవితలక్ష్యంగా పెట్టుకుని, హెల్ప్‌చేస్తుంది. ఒకవేళ ఏమీచెయ్యలేకపోతే.. ఒక్క ఫోన్‌కాల్‌తో ఎదురయ్యే సమస్యలను దూదిపింజాలుచేసి పడేస్తుంది. అపుడే కష్టపడి సాధించుకోవడం ఉన్న కిక్ తెలుస్తుంది. కష్టపడడంలో ఏదో గ్లామరు ఉంది అని చాలా వీజీగా చెప్పేసిది.

అమ్మ చేతివంట ముఖ్యంగా కాఫీ. ఇప్పుడూ ఇంటికివెళ్తే డాడీ పొద్దున్నే ఫిల్టరుకాఫీ స్వయంగా చేసి ఇస్తారు. అయినా అమ్మ కాఫీ తాగడానికి ఇంకోసారి కాఫీకి కూర్చుంటాం. వంటింట్లో – పులిహోర మా కులదైవం. రకరకాల కూరలూ – చట్నీలు, సాంబారు, వీటిమీద తనకి ట్రేడ్మార్కులున్నాయి.

అలానే ఎప్పుడైనా.. ఎక్కడనుంచయినా .. 'చేగోడి చమే, కందిపొడి చమే' అని కబురు పెడితే. వైజాగ్ నుంచీ ముగ్గురికీ మూడు పెద్ద ప్యాకెట్‌లు రెడీ అయిపోతాయి. ప్యూర్లీ హోమ్ మేడ్ చేగొడీలూ, చెక్కలూ, కందిపొడి, చారుపొడి ... ఇలా 'మొదలగునవి' కూడా!

పదేళ్ళబట్టీ పెడుతున్న సుగరు, బిపిలవల్ల నడుము నొప్పివల్ల, శారీరకంగా బలహీనురాలయినా మానసికంగా మాత్రం బలమైన శక్తిలా ఎదిగింది. తనకు ఉన్న ధైర్యం నాకు లేదు. ఎన్నో కష్టాలు, ఒడిదుడుకులూ ఎదుర్కొన్నా అమ్మ ఉందిలే అన్న ధైర్యంతో అలుపు తెలియలేదు. అమ్మ మా అందరికి పెద్ద దన్ను, ఆసరా. ఇప్పటికీ మా కాకిగోల భరిస్తూ, మా మానసిక ఆందోళనని తగ్గిస్తూ , ఒక స్నేహితురాలిగా, మమ్మల్ని స్వచ్ఛమైన ప్రేమతో ముందుకు నడిపించేది అమ్మ.

ఇప్పటికీ అమ్మ వాసన మారలేదు. అలానే జీవితంపట్ల తన పాజిటివ్ దృక్పదం మారలేదు. మా ముగ్గురూ(మేము ముగ్గురం అమ్మాయిలం) మా కాళ్ళమీద మేము నిలబడేలా చెయ్యడమేకాదు జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కొనే స్థైర్యాన్ని ఇచ్చింది. దేవుణ్ణి ఇంతకన్నా ఎవరు ఏమి అడుగుతారు?



http://sangharshana.blogspot.com/2008/05/blog-post_360.html




# మావారి 'అమ్మ'కథ

**సుజాత శ్రీనివాస్**

అమ్మలరోజు వెళ్ళిపోయినా జాన్ హైడ్ గారు అమ్మగురించి ఇంకా రాయమని ఇచ్చిన ప్రోత్సాహంతో ఈ టపా మొదలు పెట్టాను. అయితే అది మా అమ్మగురించి కాదు. గడ్డిపూలు సుజాత రాసిన అమ్మ టపాకు కొన్ని కూడికలు, కొన్ని తీసివేతలు జరిగితే మా అమ్మటపా తయారవుతుంది. కొత్తగా ఏమీ ఉండదు.(ఇంగువా, అగరొత్తులు కలిసిన పరిమళంతో సహా). అమ్మల కోసమే కాకుండా, అమ్మలా చూసుకునే అత్తగార్లకు కూడా ఒకరోజుంటే బాగుంటుందని నాకెప్పడూ అనిపిస్తుంది మా అత్తగార్నిచూశాక.

అందుకే నేను మావారి అమ్మ, అంటే మా అత్తగారి గురించి ఈ టపా రాస్తున్నాను. ఆవిడ పేరు కూడా మా అమ్మపేరే, పద్మావతి. నా వివాహం అయి తొమ్మిదిన్నరేళ్ళు అయినా ఒక్కరోజు కూడా ఆవిడలో అత్తగార్నిచూడలేదు. చూసే అవకాశం ఆమె నా కివ్వలేదు.

నిజం చెప్పాలంటే మా అమ్మదగ్గర లేని స్వేచ్ఛ నాకు మా అత్తగారి దగ్గర దొరుకుతుంది. నేను మా వారిని పేరుతో పిలవడం మా అమ్మకు (ఆమె పెరిగిన, మమ్మల్ని పెంచిన సంప్రదాయాల కారణంగా) నచ్చదు. నేను పెళ్ళైన కొత్తలో శ్రీనివాస్‌ని 'ఏవండీ' అని క్రుతంగా పిలుస్తుంటే, 'వాడిని నువ్వు పేరుతో పిలిస్తే నాకేం అభ్యంతరంలేదు. గౌరవం పిలవడంలో కాదు, మనసులో ఉండాలి' అని చెప్పారు.

ఇంకో విషయం ఏమిటంటే, ఆవిడ చాలా హాస్య ప్రియత్వం కలది, హాస్య స్ఫోరకంగా మాట్లాడగలదీను! అది ఆవిడ జీన్స్‌లోనే ఉందనుకుంటా! ఎందుకంటే పాతతరం హాస్య నటచక్రవర్తి కస్తూరి శివరావుకి ఆమె స్వయానా అన్నకూతురు మరి! వాళ్ళింట్లో (అదే లెండి అత్తవారింట్లో) ఎప్పడూ విట్లూ, జోకులే తప్ప మొహాలు మాడ్చుకోవడాలు, గొణుక్కోవడాలు, కష్టపెట్టుకుని మూగనోములు పట్టడాలు 'ఉండనే ఉండవు'!

మాది ప్రేమ వివాహం! పెద్దల్ని ఒప్పించి చేసుకున్న వివాహం! 'మీరు అప్పడే మీ అబ్బాయికి సంబంధాలు చూస్తున్నారు కదా! మీకు కోపంలేదా?' అని అడిగితే ఆవిడ ఇలా చెప్పారు. ' సరే, నేనొద్దంటాను, వాడు నేను చెప్పిన అమ్మాయినే చేసుకుంటాడు. అప్పడు నాకొరిగేదేమిటి? అమ్మకూడా నన్ను అర్థంచేసుకోలేదు' అని వాడు బాధపడటం, మీ ఎడబాటు, మరో పిల్ల గొంతు కోత! లేక మీరిద్దరు మమ్మల్ని ధిక్కరించి పెళ్ళిచేసుకున్నా, నా మీద మీకెప్పడూ గౌరవం ఉండదు, కొన్నాళ్ల తర్వాత మనం కలుసుకున్నా సరే! మానసికంగా దూరంగానే ఉంటారు. నాకు వాడు, వాడి సంతోషం ముఖ్యం!అదీకాక, వాడి ఎంపిక సరైనదని నా కెప్పడూ నమ్మకమే'.

వాళ్ళింట్లో కుటుంబసభ్యుల మధ్య రిలేషన్స్ ఎలా ఉంటాయో తెలిసింది. పైగా మా వివాహానికి గ్రీన్ సిగ్నల్ రావడానికి కారణం, వారి వివాహంకూడా ప్రేమ వివాహం కావడం! పెళ్లయ్యాక, శ్రీనివాస్ హైదరాబాదులో ఇల్లు దొరకలేదనే కారణంతో నన్ను నెలరోజులపాటు మా అత్తగారింట్లో(పశ్చిమ గోదావరి, భీమవరం పక్కనున్న ఉప్పలూరు అనే పల్లెటూరులో) ఉంచాడు. ఆ నెల రోజుల్లో మా అత్తగారు, నేను మరింత స్నేహితులయ్యాము. ముఖ్యంగా మా ఇద్దరి

# మావారి 'అమ్మ'కథ

సుజాత శ్రీనివాస్




ఉమ్మడి అభిరుచి క్రాస్‌వర్డ్‌పజిల్స్ పూర్తిచేయడం కావడంతో అంత పెద్ద కష్టం కాలేదు. అప్పట్లో ఆంధ్రప్రభలో అరుణమణి పేరుతో శ్రీపెద్దిభొట్ల సుబ్బరామయ్యగారు కష్టమైన (పొద్దు పజిల్స్ లాగానే) పజిల్స్ ఇచ్చేవారు. అవీ, రచన మాసపత్రికలో ఇచ్చే బహు కష్టమైన పజిళ్ళు ఇద్దరం కలిసి పూరించేవాళ్లం. ఇప్పటికీ కష్టమైన పజిల్‌కి సొల్యూషన్ ఇస్తే సరిగ్గా పూరించిన వారి పేర్లలో బి. పద్మావతిగారి పేరు తప్పక ఉంటుంది.

ఆ నెల్రోజుల్లోనే నేను శ్రీనివాస్‌కి ఇష్టమైన పనసపొట్టు ఆవపెట్టిన కూర, వంకాయ పచ్చిపులుసు, కంది పచ్చడి, పాతోళీ వగైరాలన్నీ నేర్చుకున్నాను. మా మామగారి పాత్రని విస్మరించకూడదిక్కడ! ఆయన ఇంట్లో ఉన్నారంటే పొట్ట ఒక చేతపట్టుకుని ఉండాల్సిందే! అంత హాస్యంగా మాట్లాడతారు.

మా అత్తగారు నరసాపురంలో హైస్కూలు హెడ్ మిస్ట్రెస్‌గా రిటైర్ అయ్యారు. ఉద్యోగ బాధ్యతలరీత్యా బిజీగావున్నా, పిల్లలు ముగ్గిర్నీ ఎంత క్రమశిక్షణతో పెంచారంటే, బాగా కోపం తెప్పించే అంశాన్నికూడా పాజిటివ్‌గా తీసుకుంటారు వాళ్లు. నావల్లయితే కాదనిపిస్తుంది. ఒక్కసారి ఆమె రిటైర్ అయ్యాక, పిల్లల కోసం పాటలు, పద్యాలు రాసి పత్రికలకు పంపుతుండేవారు.

ఆవిడ సత్సంగీ(దయాల్బాగ్, ఆగ్రా) అందువల్ల మడి, పూజలు కూడా తప్పనిసరికాదు. మా మామగారు సత్సంగీ కాదు. ఆయన పూజకుమాత్రం ఈవిడన్నీ రెడీచేసి ఉంచుతారు. ఒకరి ఆధ్యాత్మిక చింతనని ఒకరు విమర్శించుకోరు.

రెండువైపులా డబ్బున్నా, అలక పానుపుదగ్గరో, మనుగుడుపులదగ్గరో చిన్నచిన్న విషయాలు మనసులో పెట్టుకుని జీవితాంతం కోడళ్లని సాధించిన (సాధించడం అంటే తిట్టక్కర్లేదు, కొట్టక్కర్లేదు, నవ్వుతూ ఒక వ్యంగ్యం విసిరితే చాల్దూ) వాళ్లని బోలెడు మందిని చూసాను. మా ఇంట్లో కట్నానికి చోటులేదు, ఇక లాంచనాలదాక ఎందుకు? మా వారు నా మీద ఫోన్లో ఏవైనా ఫిర్యాదులుచేసినా నాకేయం భయంలేదు. ఇందుకంటే అటువేపునుంచి మా అత్తగారు 'ఇక ఆపరా! నా కోడలిసంగతి నాకుతెల్సులే, నువ్వు మూసేయ్' అంటారని నాకు తెలుసు.
మా ఇంట్లో పద్ధతులివి, నువ్విలాగే ఉండాలి అని ఈనాటికీ నాకెవరూ అత్తవారింట్లో చెప్పలేదు(నేనూ అడ్వాంటేజ్ తీసుకోలేదు).

మా అత్తగారొస్తే నాకు చిన్ననాటి స్నేహితురాలొచ్చినట్టుంది. చెప్పుకోడానికి బోలేడు కబుర్లొస్తాయి. మామూలు ఆడవాళ్లే అయినా, కోడళ్లవిషయంలో హెడ్ మిస్ట్రెస్సులా ఉండే అత్తగార్లకి వ్యతిరేకంగా నిజజీవితంలో హెడ్ మిస్ట్రెస్ అయ్యుండి, కోడలితో స్నేహితురాలిలా ఉండేది ఒక్క పద్మావతి గారేనేమో!

నేను కవితాత్మకంగా చెప్పలేకపోయుండొచ్చు, సమగ్రంగా చెప్పి ఉండకపోవచ్చు, కాని మనస్ఫూర్తిగా మాత్రం చెప్పాలనిపిస్తోంది.
కోడలిలో కూతుర్ని చూడగలిగిన ఆ అమ్మకి మదర్స్ డే సందర్భంగా తలవంచి నమస్కరిస్తున్నాను

కవిత

# బడిలో అమ్మఒడిలో

దార్ల వెంకటేశ్వర రావు





ఈ కులంలో పుట్టకపోతే
నేనూ ఇంకోలా ఆలోచించేవాణ్ణేమో
ఈ కులంలో పుట్టటమే మంచిదయింది
అవమానమంటే అర్థమైంది
ప్రాచీన సాహిత్యం పాఠమైనప్పుడల్లా
నా ముఖకవళికలన్నీ మారిపోయేవి
బయటపడకూడదనో
పారిపోవాలనో, బహిష్కరించాలనో
అనుకొంటుండేవాణ్ణి
మూకుమ్మడిగా కళ్లన్నీ నాపైనా ఫోకస్!
ఎన్నిసార్లు చంపుతావంటూ
దేవుణ్ణి కాలర్‌పట్టుకోవాలనిపించేది!
నాకు తెలీదు
అమ్మగర్భంలోనైనా అవమానాలకి దూరంగా ఉన్నానోలేదో
బాబుకి కాలుమీద మచ్చెలావచ్చిందని
ఈ మధ్య అమ్మనడిగితే
ప్రశ్నించటం నేర్చుకుంటున్నాడేమవుతోందని
అనుకుంటూ తడబడుతూనే చెప్పింది
"నువ్వు కడుపులో ఉండగా పెద్ద తుఫానొచ్చింది
ఊళ్ళో జనమంతా పెద్దోళ్ళింటికెళ్ళిపోయారు
నేనూ కడుపీడ్చుకొంటూ కసింతచోటిమ్మని బతిమిలాడాను
మైలపడితే చచ్చిపోతామంటూ లోనికేకాదు
పంచకే చేరనివ్వలేదు!
రివ్వురివ్వున గాలి
పెద్దపెద్ద ఉరుములు
హోరునవర్షం

# బడిలో అమ్మఒడిలో

దార్ల వెంకటేశ్వర రావు

కవిత



ఎప్పుడేమవుతుందో ఎవరికీ తెలియదు
కూకటివేళ్ళతో కూలిపోతున్న
ఆ చెట్లే దిక్కయ్యాయా రెండ్రోజులూ!
తుఫాను వెలసిన మర్నాటికి
ఆకలితో నకనకలాడి కళ్ళుతిరిగిపడిపోయాను
నిండుచూలాల్ని బతికించమని
ప్రాధేయపడుతూ మళ్ళా పెద్దోళ్ళింటికే వెళ్ళాడు మీబాబు
పొద్దుకాలమంతా పెద్దోళ్ళకే కదా పనిచేసేది
కాసిన్ని గంజినీళ్ళయినా పోయమని అర్థించాడు
కట్టెలు కొట్టుకొస్తే పోస్తామన్నారు
ఖాళీ కడుపుతోనే
తూలిపోయినా కట్టెలతోపాటు
కాలు గాటుపెట్టుకునైనా కాసాన్ని గంజినీళ్ళు సంపాదించాడు
గుక్కెడు మాత్రమే గుటకేసాను
కడుపులో ఇమడలేదు
మీ బాబు రుచిచూస్తేతెలిసింది
పెద్దోళ్ళుపోసింది బియ్యం కడుగని"!
ఇలా...
ఇంకెన్ని గుండెల్లో దాచుకున్నారో
గుచ్చి గుచ్చి అడిగితేతప్ప నాకు చెప్పరెప్పుడూ!
ఈ కులంలో పుట్టటమే మంచిదయింది
లేకపోతే మనుషుల్ని ప్రేమించలేకపోయేవాణ్ణేమో
అవమానాలకి తట్టుకోలేక
ఆగ్రహంపట్టలేక హత్యలెన్నింటినో చేసేసే వాణ్ణేమో!

# మా అమ్మనాన్న

టపా

రాజేంద్ర దేవరపల్లి



జాన్ హైడ్ కనుమూరి కవి గారు పెద్ద చిక్కే తెచ్చి పెట్టారు. అమ్మ అన్న బ్లాగ్విషయం ఇచ్చారు. ఆ! ఏముందిలే ఏదో ఒకటి రాసి అవతల పడేద్దామనుకున్నా. కానీ మొదలుపెట్టాక నిజం చెప్పాలంటే అసలు మొదలుపెట్టడమే కష్టమయ్యింది. అమ్మ మనం భూమ్మీదకొచ్చాక కాదు. ఆమె కడుపున మనం పడ్డప్పటినుంచీ మనకు అమ్మ.

మా అమ్మగురించి ఏమిరాయాలో నాకు అంతు పట్టడంలేదు. అసలు ఇలాంటి స్థితి వస్తుందని కూడా నాకు తట్టలేదు. మా అమ్మ పేరు నాగమ్మ. వాళ్లమ్మనాన్నలకు ఎనిమిదవ సంతానం. గారాబంగా పెరిగింది. వాళ్ళ ఊరు హైస్కూలులో అప్పటి తొమ్మిదో తరగతి వరకూ చదివింది. పదో క్లాసు ఎందుకు చదవలేదో నాకు తెలియదు కానీ, ఆమె చదువు తర్వాత మా జీవితాలకు ఆధారం, రక్షణ అయ్యింది.

మా అమ్మనాన్నలకు నేను ఒక్కడినే సంతానం. నాకు ఆరునుంచి తొమ్మిది నెలల వయసున్నప్పుడు మా నాన్న హఠాత్తుగా గుండెపోటుతో మరణిస్తే, గుండెనిబ్బరం సడలనివ్వకుండా, తను ఒక చిన్న ప్రభుత్వ ఉద్యోగంచేస్తూ , నాకు దాదాపు ఏ విషయంలోనూ లోటంటూ రానివ్వకుండా, నన్ను చదివించింది. నేను ఆమె కోరికమేరకు యధాశక్తి బాగా చదివాను. కాబట్టే నాకు రెండవక్లాసు కాగానే డబుల్ ప్రమోషన్ ఇచ్చి నాలుగులో పడేసారు. పదో తరగతి వరకూ రాముడు మంచిబాలుడు అనటానికి ఉదాహరణగా నన్ను చూయించేవారు.

ఇంటర్మీడియెట్ ఒక సంవత్సరంలో కాలేజీ మొత్తానికి అత్యధిక మార్కులొచ్చినా, సబ్జెక్టులో యూనివర్సిటీ ఫస్టువచ్చినా, ఈనాడు జర్నలిజం స్కూలు ప్రవేశ పరీక్షలో రాష్ట్రం మొత్తానికి ప్రధముడుగా నిలిచినా, మాస్టర్ ఆఫ్ జర్నలిజం ఎంట్రన్స్‌లో ఫస్ట్‌వచ్చినా ఇలా చాలాసార్లు చదువుపరంగా మా అమ్మను సంతోషపరచాను.

కానీ నేను డిగ్రీనుంచి మా ఇంటికి మెల్లగా దూరమౌతూ వచ్చాను. డిగ్రీ మూడు సంవత్సరాలు హాస్టల్, అక్కడనుండి నుంచీ యూనివర్సిటీ, తర్వాత పెళ్ళి ఇలా అమ్మకుదూరంగానే ఉన్నాను. ఆరునెలలు తక్కువ నలభైసంత్సరాలు పనిచేసిన ఆ చిన్న ఉద్యోగం నుంచి రిటైరయ్యాక వచ్చిన నాలుగు డబ్బులు, దగ్గర బంధువులు అప్పుగా

## మా అమ్మనాన్న

రాజేంద్ర దేవరపల్లి

టపా

తీసుకోవటం చివరకు  సహజంగా ఎగ్గొట్టటంతో తీవ్రంగా కలతచెంది, నా డబ్బు నా కొడుక్కి దక్కకుండాపోయిందన్న మనోవేదనతో క్రమంగా దిగులుపెట్టుకుని జ్ఞాపకశక్తిని కోల్పోయింది. అలాంటి స్థితిలో మా పెద్దమ్మవాళ్లు ఎంతో జాగ్రత్తగా చూసుకున్నారు. కొన్నేళ్లు అలా గడిచాక నా వద్దకు తెచ్చుకున్నాను. అప్పటికే ఆమె మానసిక స్థితి పొత్తిళ్ళలోని పసిపాపలా ఉండేది. అప్పుడు నా భార్య ఎనిమిదినెలల గర్భవతి అయినా కూతురుకన్నా ఎక్కువగా సపర్యలు చేసింది. నెలలునిండుతున్న నా భార్యను శారీరకంగా, మానసికంగా ఒత్తిడికి గురిచెయ్యలేక మళ్ళీ మా వాళ్ళు మా ఇంటికి తీసుకువెళ్ళి కొన్నినెలల తర్వాత తీసుకొచ్చారు.

ఈ క్రమంలో ఒకరోజు ఆమె కాలిగోరు గుచ్చుకుని పాదం, కాలివేళ్ళు గాంగ్రిన్‌గా మారుతున్నాయి. కారణం అప్పటికే శరీరాన్ని స్వాధీనంచేసుకున్న షుగర్. నా శక్తివంచన  లేకుండా చికిత్స చెయ్యిద్దామని చూసినా షుగర్ తగ్గకుండా ఏమీ చేయలేమని డాక్టరన్నారు.

కొన్నాళ్ళకు, అప్పటికి నేనొక దిక్కుమాలిన దినపత్రికలో పనిచేస్తున్నా. అలాంటి దరిద్రపు వెధవలకు ఎప్పుడూ ఉండేరోగమే వాడికీ ఉంది. అదేమిటంటే జీతాలు ఇవ్వకపోవటం. ఒకరోజు విసుగొచ్చి మానేసి, తెల్లారి యూనివర్సిటీకి వెళ్ళొచ్చా. వచ్చేసరికి మా ఇల్లు తలుపులన్నీ తీసి ఉన్నాయి.  కానీ నా భార్య, మా అమ్మ ఎక్కడా కనిపించలా, పక్కన ఖాళీ స్థలముంటే అప్పటికే చాపమీద పడుకోబెట్టారు. మొదట నాకు అర్థంకాలేదు కానీ క్రమంగా అవి అంతిమ ఘడియలని తెలిసింది. ఊపిరి పీల్చుకునేందుకు ఆమె పడుతున్న బాధచూసి నన్ను ఎంత శపించుకున్నానో, అంతకన్నా మంచి చికిత్స ఇప్పించలేని నా చేతకానితనానికి, గాంగ్రిన్ పాలపడ్డ కాలునుంచి  రక్తం ధారలుగా కారుతుంది. నా గుండెల్లోని బడబాగ్నులను మరింతగా ప్రజ్వరిల్లజేస్తూ. సిగరెట్ కాల్చుకునే వంకతో కాస్తదూరంగా పోయి కూర్చున్నా. మా ఆవిడవచ్చి ఒక్కసారి చూద్దువురా అని తీసుకెళ్ళింది. అప్పటికే ఈ నిర్భాగ్యుడిని కన్నపాపానికి  ఆమె అక్కడ, ఆ చాప మీద అత్యంత బాధాకర పరిస్థితిలో కన్నుమూసి  ఇహలోక ఈతిబాధలనుంచి

## మా అమ్మనాన్న

రాజేంద్ర దేవరపల్లి



విముక్తి పొందింది.

బ్రతికినన్నాళ్ళూ ఆమెను ఏమాత్రం సుఖపెట్టలేకపోయానే అన్న బాధతో కుమిలిపోతున్ననాకు నేను ఏడుస్తున్నానో, గోడకు తలబాదుకుంటున్నానో, నేలమీదపడి దొర్లుతున్నానో తెలియని స్థితి. అలా కొన్ని గంటలు గడిచాక ఎవరో అడిగారు మీ పాప ఏదని? ఒక్కసారి గుండె ఆగినంత పనయ్యింది. కారణం ఆరోజు శనివారం. స్కూలు మధ్యాహ్నం పన్నెండున్నరవరకే. కానీ అప్పుడు సమయం మూడుగంటలు. రోజూ నేనో, నా భార్య ఎవరో ఒకరం వెళ్ళి తీసుకొచ్చేవాళ్ళం, కానీ ఆరోజు మా అమ్మదగ్గర గడిచిపోతూ ఉండగా ఇంతకీ ఎక్కడుందని ప్రశ్న. అప్పుడు మా ఆవిడ వాళ్ల కారు తీసుకుని స్కూలుకెళ్తే క్లాసురూములో ఆకలికి, నిద్రకూ జోగుతున్న నా కూతురు కనిపించితే మళ్ళీ మా అమ్మ బ్రతికినంత ఆనందంగా ఫీలయ్యాను. కానీ ఆ క్షణాన కడుపునపుట్టిన పిల్లలపట్ల తల్లిదండ్రులకు ఉండే పేగు బంధం ఎంతబలీయమో తెలిసివచ్చింది. ఇలా ఎన్ని వందల వేలసార్లు మా అమ్మగురించి నాగురించి ఆలోచిస్తూ నిద్రలేని రాత్రులు గడిపివుంటుందో ఊహకు అందక కన్నీళ్లతో ఆ లెక్కలు చెరిపేసాను.

జేబుచూస్తే ఒక్కవెయ్యి రూపాయలున్నాయి. ఒక్క వెయ్యితో వైజాగులో అంత్యక్రియలు చెయ్యగలమా? ఒకరిద్దరు మిత్రుల సహాకారంతో ఆ పనీ పూర్తిచేసాను.

ఇలా చెప్పుకుంటూ పోతే కొన్నివందల పేజీలకు సరిపడా అనుభూతులున్నాయి నా దగ్గర. కానీ మా అమ్మనాన్న నా దగ్గరలేరని నాకు ఎన్నడూ చింత ఉండేది కాదు. కారణం మా పిల్లలిద్దరూ అచ్చం మా అమ్మనాన్నలా పుట్టటం. మా పాపను చూస్తే మా అమ్మను చూడక్కర్లే. అలాగే మవాడు మా నాన్న. మా పిల్లలిద్దరూ అయిదు సంవత్సరాల తేడాతో ఒక్కనెలలో, అదే హాస్పిటల్లో, రూములో పుట్టటం నాకొకరకంగా ఆనందం, మరో విధంగా ఇబ్బంది. ఎందుకంటే ఏమీ అనలేను, తిట్టలేను అన్నట్టుంది.

- : 0 : -




# అమ్మ!!!

కస్తూరి మురళీకృష్ణ

దేవరపల్లి రాజేంద్రగారి బ్లాగులో వాళ్ళమ్మ గురించి రాసినది చదివిన తరువాత నేను మా అమ్మ గురించి రాయకుండా వుండలేకపోతున్నాను. నేను రాయబోయేవి నా అంతరంగిక విషయాలు. నా డైరీ తప్ప ఇంకెవరికీ, కనీసం నా భార్యకు కూడా అనేక విషయాలు తెలియవు. అవి ఇలా బహిరంగంగా రాయటం గురించి నాలో బోలెడంత మథనం జరుగుతున్నా రాయాలన్న ఆవేశాన్ని అణుచుకోవటం కష్టంగావుంది. వీలయినంత విచక్షణ ప్రదర్శిస్తూ రాసే ప్రయత్నంచేస్తున్నాను.

నా జీవితంలో నేను ఏమిసాధించినా దానికి అమ్మే కారణం. నా వైఫల్యాలకు నా వ్యక్తిత్వలోపం, నాలో ఉన్న ఇతర జీన్స్ ప్రభావం కారణం అని నేను ఎటువంటి సంకోచంలేకుండా చెప్పగలను. మనుషులను అర్థంచేసుకోవటం, ఎవరినీ నొప్పికుండా సానుభూతితో మెలగటం అమ్మస్వభావం. అది నాకూ వచ్చింది. అయితే, హఠాత్తుగా విచక్షణ కోల్పోయి మనసులో నొప్పించాలని లేకున్నా మాట జారటంకూడా వచ్చింది. నా ప్రమేయం లేకుండానే అలా ప్రవర్తిస్తున్నప్పుడు ఆశ్చర్యపోతుంటాను. ఎందుకిలా ప్రవర్తిస్తున్నానని తర్కించుకుంటాను. నా ప్రమేయం లేకుండా నన్ను నాలోవున్న కొన్ని లక్షణాలు అలా ప్రవర్తించేందుకు ప్రోద్బలం ఇస్తున్నాయని, నా సహోదరీ సహోదరులను చూస్తే అర్థమయింది. ఒక అడుగు ముందుకూ, రెండడుగులు వేస్తూ పడుతూ లేస్తూ సాగుతున్నాను.

అమ్మ శాంత స్వభావురాలు. ఎవరినీ నొప్పించదు. తను నొప్పించిన వారిని కూడా పోనీలే ఎవరి పాపం వారిది అని వదిలేస్తుంది. చాలా మెత్తని స్వభావం అమ్మది. అయితే, మెత్తది కాబట్టి మొత్తవచ్చని అనుకుంటే పొరబడ్డట్టే. నాన్నగారు లెక్చరరు. ఆ కాలంలో ఆర్థిక ఇబ్బందులు తట్టుకునేందుకు అమ్మ ఉద్యోగం ఆరంభించింది. ఆ కాలంలో అదొక సంచలనం. బంధువులంతా అమ్మను దూషించారు, ఎకసక్కేలాడారు. ఇల్లుదాటి బయటకు మహిళ మంచిది కాదని ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించారు. అమ్మకు, నాన్నగారి అండ వుండేంది. అంటే మానాన్నగారు ముందుచూపుతో వ్యవహరించారన్నమాట.

11 మంది సంతానంలో మా నాన్నగారే పెద్దవారు. ఇంటి బాధ్యత ఆయనది. అమ్మ, నాన్న సంపాదిస్తూ తమ సంసారమేకాక ఇతరులను పోషిస్తూండేవారు. మా బాబాయిలూ, అత్తయ్యలూ అంతా మా దగ్గరేవుండి చదువుకున్నారు. అందరికీ చాకిరీచేస్తూ, వుద్యోగంచేస్తూ, మమ్మల్ని చూసుకుంటూ, ఆర్థికంగానేకాదు మానసికంగా నాన్నగారికి చేదోడు వాదోడుగా నిలుస్తూ ఒక మనిషి ఇన్ని పాత్రలను సమర్థవంతంగా నిర్వహించేది. ఇప్పుడు ఒక్కపిల్లవాడినే చూసుకోలేక బాధలు పడేవాళ్ళని చూస్తుంటే నవ్వొస్తుంది. మేము అయిదుగురం. మేముకాక బాబాయిలు, అత్తయ్యలు, ఇతర బంధువులు. ఏలోపమయినా మూతిముడుపులు, అలుగులు. అయినా అమ్మ పల్లెత్తుమాట అనేదికాదు. నన్నిలా అన్నారు అని కోపం తెచ్చుకునేదికాదు. నాన్నగారి బాధ్యతలన్నీ తనవే అన్నట్టు ప్రవర్తించింది. నాన్నగారు పోయిన తరువాత కూడా ఈనాటికీ అలాగే ప్రవర్తిస్తుంది.

నా పెళ్ళినిశ్చమయిన తరువాత కాబోయే భార్యకు ఈ విషయం చెప్పాను. అమ్మని చూసిన

# అమ్మ!!!

కస్తూరి మురళీకృష్ణ



తరువాత తనూ అర్థంచేసుకుంది. అలానే ప్రవర్తిస్తుంది. దాంతో చెల్లెళ్ళు, సోదరులూ అందరికీ కేంద్రంగా అయింది. నాతో మాట్లాడని బందువులుకూడా నా భార్యను పలకరిస్తారు, మెచ్చుకుంటారు.

మా నాన్నగారు మా చిన్నప్పుడే పోయారు. బందువులకోసమని ఆయన వూరంతా అప్పులుచేసారు, అయినా సంతృప్తిలేని బంధువులు నాన్నగారి ఆఫీసునుంచి వచ్చే డబ్బులకోసం ఆత్ర పడ్డారు. నాన్నగారు మరణించటంతో అమ్మ వుద్యోగం వదిలి తాతయ్యదగ్గర వుండాలనుకుంది, కానీ వాళ్లు మమ్మల్ని చదివించేబదులు హోటళ్లలో, సైకిలు దుకాణాల్లో పెట్టాలని ఆలోచిస్తూండటంతో అమ్మ మళ్ళీ ఉద్యోగం ఆరంభించింది. అమ్మ పట్టుదల అందరికీ తెలిసింది. పైకి మెత్తగావున్నా అవసరమయితే కాళికా మాత దుర్గాదేవి అవుతుంది. వొంటరిగా అందరిని ఎదిరించి అమ్మ మమ్మల్ని చదివించింది. నాన్నగారి అప్పుల్నితీర్చింది. అమ్మ ఎన్ని కష్టాలు పడిందో చెప్పాలంటే అదొక వెయ్యిపేజీల గ్రంథంఅవుతుంది. అడుగడుగునా తోడేళ్ళు, నక్కలూ, పులులూ సింహాలే, వాటినడుమ అయిదుగురితో అమ్మ. ఆమె ధైర్యము, ఆత్మవిశ్వాసమూ మాకు స్ఫూర్తినిస్తున్నాయి ఇప్పటికీ. ఎటువంటి అడ్డంకి ఎదురయినా పోరాడటయే తప్ప లొంగటం మాకు అలవాటు కాకపోవడానికి అమ్మే కారణం.

ఎదిగిన తరువాత గాన్ విత్ ద విండ్ నవల, మదర్ఇండియా సినిమాల్లో నాయికల పట్టుదలలు, ఆత్మ గౌరవాలు అమ్మముందు పనికిరావని అర్థమయింది. అందుకే అమ్మే నాకు ఆరాధ్య దైవం.

ఆ కాలంలో అయిదుగురమూ గంజి తాగేవారం. ఒకడు కడుపునిండా తింటే ఇంకొకడికి కడుపునిండదేమో అన్న భయాలతో త్యాగాలు చేసుకునేవారం. ఆ అలవాటు ఇప్పటికీవుంది. జేబునిండా డబ్బువున్నా ఒక్కడినే తినలేను. అయ్యో మిగతావాళ్ళు తిన్నారా అనిపిస్తుంది. తినకుండానే మిగిలిపోతాను, తిట్టుకుంటాను. ఒకోసారి అన్నం సరిపోదని అమ్మముద్దలు కలిపి పెట్టేది. అప్పుడు అదొక ఆట. అలా ఎందుకు పెట్టేదో తరువాత అర్థమయింది.

అయితే అన్నానికి లేకున్నా పుస్తకాలు చదవటంలో రాజీ పడేదికాదు. అవసరమయితే ఏదో ఖర్చు తగ్గించేది కానీ పుస్తకాలు కొనటం చదవటం మానేదికాదు. అదే అలవాటు నాకూ వచ్చింది. పుస్తకాలు కొనే విషయంలో డబ్బుచూసుకోను. అది తప్ప మిగతావన్నీ అనవసరమయిన ఖర్చులే అనిపిస్తాయి. ఎంతోమంది అమ్మను ప్రలోభ పెట్టాలని ప్రయత్నించారు. హింసించి కసి తీర్చుకున్నారు, ఇష్టమొచ్చినట్టు మాటలన్నారు. అమ్మ అందరినీ క్షమించింది. వారు సహాయం అడిగినప్పుడు చేతనయినంత చేసింది.

చదివి వుద్యోగంచేసి చేతికి వస్తాడనుకున్న పెద్దన్నయ్య ప్రచారక్‌గా వెళ్ళిపోయినా అమ్మ అధైర్యపడలేదు. రెండో అన్నయ్య ప్రేమపెళ్ళిచేసుకుని ఇల్లొదిలి పోయినా అమ్మ పట్టించుకోలేదు. పరిస్థితిచూసి నేను చదువుమానేసి వుద్యోగం చూసుకుంటానన్నాను. పిచ్చి వేషాలు వేయొద్దని తిట్టింది.నేను వెళ్ళిపోయినా బాధలేదంది. చదివితేనే ఇంట్లో వుండమంది. అప్పుడొక విషయం




# అమ్మ!!!

కస్తూరి మురళీకృష్ణ

అర్థమయింది. అమ్మ ఒక ప్రవాహం లాంటిది. ఉపనదులతో పనిలేదు. ఎవరెనిన్న రాళ్లువిసిరినా బాధలేదు, తాను తన కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే వుంటుంది. అది అర్థమయిన తరువాత అమ్మచెప్పినట్టే విన్నాను. ఎమ్మెస్సీ చదివాను, కానీ అమ్మకు సహాయపడాలన్న ఆత్రంలో రీసెర్చివదిలి వుద్యోగం వెంటపడ్డాను. ఇప్పటికీ అమ్మమాట వినాల్సిందని బాధపడతాను. వుద్యోగంలోని అసంతృప్తి రచనలవైపు తోసింది. నా రచనలకు ప్రథమ పాఠకురాలు అమ్మే! అమ్మ సలహాలతో నాదంటూ ప్రత్యేక శైలిని ఏర్పరచుకున్నాను. నా పెళ్ళికూడా అమ్మచూపిన అమ్మాయిని కళ్ళుమూసుకుని చేసుకున్నాను. అత్యంత ఆనందంగావున్నాను. బహుశ నాకు నచ్చినవారిని చేసుకుని వుంటే ఈపాటికి జుట్టుపీక్కుంటూ , చొక్కా చింపుకుని ఎందుకూ పనికిరాకుండా పోయేవాడిని. అమ్మ చెప్పిన మాట విన్నప్పుడల్లా నేను విజయం సాధించాను.

నేను కాలేజీలో వున్నప్పుడు ఇర్వింగ్ వాలాస్ నవల ది ఫాన్ క్లబ్ తెచ్చుకుని రహస్యంగా చదువుతుంటే, చెల్లెలుచూసి అమ్మకు చెప్పింది. అమ్మ నన్ను తిట్టలేదు. రహస్యంగా భయపడుతూ చేసే పనులు చేయవద్దంది. ఏ పనయినా ధైర్యంగా చేయమంది. ఇది నా జీవిత సిద్ధాంతంగా మారింది. రచనలు చేయటంలో మార్గదర్శకంగా నిలిచింది. ఆ సంవత్సరం నా పుట్టినరోజున ఆ పుస్తకం అమ్మ నాకు గిఫ్ట్‌గా ఇచ్చింది. ప్రతి పుట్టినరోజు అమ్మ నాకు పుస్తకాలే ఇస్తుంది. ఒకసారి డబ్బులులేక ఒక నోట్‌బుక్ ఇచ్చింది. దాన్ని నేను నా నిఘంటువుగా మార్చుకున్నాను.

ఇలా చెప్తూపోతే నా జీవిత కథ మొత్తం చెప్పాల్సి వుంటుంది. ఆ కాలంలో నేను ఎప్పుడు గుడికి వెళ్ళినా అమ్మను ఆనందపరచేట్టు చేయమని ప్రార్థించేవాడిని. దేవుడు కరుణించినట్టు నా భార్య అమ& స్నేహితుల్లావుంటారు. నేను ఇద్దరు చెల్లెళ్ల పెళ్ళికి అమ్మపక్కన నిలిచాను. అమ్మ రిటైర్ అయిన తరువాత దేశమంతా తిప్పి చూపాను. ఇప్పుడు ప్రతి ఆదివారం అమ్మ చూడాలన్న ప్రదేశానికి అందరం వెళ్తాం. నాకు అత్యంత ఆనందకరమయిన విషయమేమిటంటే, పెద్దన్నయ్య వచ్చి స్థిరపడినా అమ్మ నా దగ్గరే వుండటం. ఎవరయినా ఏమయినా అన్న ఇది నా ఇల్లు అంటుంది.

చెప్పటం మరిచా ఇల్లు కట్టిన తరువాత ఇంటికి అమ్మపేరుతో సత్యవతీ సదనం అనే పెట్టాను. ఎంత చేసినా తీర్చుకోలేని రుణాల్లో అమ్మ రుణం ఒక్కటే. అమ్మ ప్రభావంతో నా రచనల్లో మహిళపాత్రలన్నీ ఉత్తమ వ్యక్తిత్వంతో వుంటాయి. మహిళలపట్ల చులకన భావం మచ్చుకి కూడా కనబడదు.

ఇంకా బోలెడన్ని చెప్పేవున్నా ఈ సారికి ఇంత చాలు. అమ్మగురించి చెప్పేందుకు జీవితకాలం సరిపోదు.




# అమ్మమ్మ!!!

రమ్య



జాన్ హైడ్ కనుమూరి గారు కోరిన బ్లాగ్విషయం అమ్మగురించి రాసినవారి టపాచూసి నాకూ కొద్దిగా రాయాలనిపించింది. పదిమంది మాట్లాడే వేళ మనం మనకిష్టమైన వారి గురించి అక్కడ చెప్పకోవటాన్ని మించి మనకిష్టమైన వారికి మనం ఇచ్చేగౌరవం ఇంకేముంటుంది(కాకపోతే ఇది వారు చెప్పినట్టు అమ్మగురించికాదు).

అమ్మతనాన్ని నేను రుచిచూసింది మా అమ్మమ్మదగ్గరే. గడ్డిపూలు సుజాతగారు రాసిన అమ్మ టపాకు కొన్ని కూడికలు, కొన్ని తీసివేతలు జరిగితే మా అమ్మ టపా తయారవుతుంది. కొత్తగా ఏమీవుండదు.(ఇంగువా, అగరొత్తులు కలిసిన పరిమళంతో సహా)అని సుజాతగారన్నది నిజం.

మనకిష్టమైన అమ్మలో కామన్‌గా కొన్నిపోలికలు ఉంటాయి. అందరూ అన్నీ చెప్పేశారు, అవే ఐనా మళ్ళీ ఓ నాలుగు వాక్యాలు రాయాలనిపించింది. నా జీవన సరళిపై అమ్మమ్మ ప్రభావం ఎంతో ఉంది. ఆమెదగ్గర ఉండి నేర్చుకోకపోయినా ఎందుకో నా అలవాట్లు, పద్దతులు చివరికి వంటకూడా ఆమెలాగే ఉంటాయి.

మా అమ్మ చదువు, ఉద్యోగం మూలంగా నా పసితనం అమ్మమ్మ ఒడిలోగడిచింది. అమ్మమ్మకి ఆరుమంది సంతానం ఉన్నా మమ్మల్నీ మురిపెంగా లాలించేది. ఎంతో గారాబంగా చూసేది. తన మొహంలో విసుగు, కోపం నేనెప్పడూ చూడలేదు.

చాలా చిన్నతనంలో అమ్మమ్మ పక్కనే కూర్చుని తనతోపాటు దీపారాధనచేయటం, తను వంటచేసుకుంటుంటే పక్కన నేనూ నా బొమ్మలతో ఉత్తిత్తి వంటచేయటం నా మధురజ్ఞాపకాలు. టమోటో ముక్కలూ, ఉడికించిన బంగాళాదుంపలూ గుటుక్కు మనిపిస్తూ నా బొమ్మల వంటచేసేదాన్ని ఆమె పక్కనే కూర్చుని. చపాతీలు చేసేప్పడు, ఏవైనా పిండివంటలు చేసేలప్పడు నేనూ పక్కనే కూర్చుని నా వంట మొదలెట్టేదాన్ని. విసుక్కోకుండా నాకు చిన్నచిన్న అప్పాల్ని కాల్చి ఇస్తూ ఎంకరేజ్‌చేసేది.

ఊరగాయలు, వడియాలు, మజ్జిగమిరపకాయలు రోజుల్లోనైతే నాకు సందడే సందడి. అమ్మమ్మ చంకనెక్కి కూరగాయల మార్కెట్‌లో ఊరేగిన ఆ

# అమ్మమ్మ!!!

రమ్య

టపా

రోజులు ఎంత గొప్పవో నాకుమాత్రం తెలుసు.

అంతమందికి వండివార్చీ, ఇంటా బయటా పనుల్లో మునిగితేలినా ఏమాత్రం అలసటా, విసుగులేకుండా రాత్రులు మాకెన్ని కథలుచెప్పేదో, నాకు ఎన్నోపాటలు నేర్పేది. రాత్రులు కమ్మటి అమ్మమ్మని కౌగిలించుకుని ఆమెచెప్పిన జానపద కథలూ, భయపడుతూనే అడిగి అడిగి చెప్పించుకున్న దెయ్యంకథలు వినడం నా మధుర అనుభవాలు. లేచిన దగ్గరనుండి ఏదోపనిచేస్తూనే కనిపించేది. నిద్రకుముందు కథచెప్పేటప్పుడు మాత్రమే ఆమె పనిచేయని చేతుల్ని చూసేదాన్ని.

తోటివారితో స్నేహంగా ఉండటం, ప్రేమ. దయ, అడిగినవారికి చేతనైనంతలో సాయం చేయడం నేను ఆమెదగ్గరనుండే నేర్చుకున్నా. ఇరుగు పొరుగు అంతా ఆమెను ఇష్టపడేవారు. మావయ్య, పిన్నిల స్నేహితులకీ ఆమె అంటే ఎంతో అభిమానం ఉండేది. అమ్మా అంటూ ఆమెచుట్టూ తిరిగేవారు. వీళ్ళు సిటీలో ఉండటం మూలంగా వచ్చీపోయే బంధువులూ ఎక్కువే.

అన్నీ పడకపైనే ఐనరోజుల్లో అత్తగారికి ఆమెచేసిన సేవగొప్పది.

అక్కడినుండి మా ఇంటికివచ్చాక మళ్లీవెళ్ళింది తక్కువ. సెలవుల్లో ఓ నాల్గురోజులు అంతే. గారంపెట్టి పాడుచేస్తారు, డిసిప్లేన్ ఉండదు అని మా ఇంట్లో అభిప్రాయపడేవారు.
లేతప్రాయంలో నా మనసులో పడ్డ ఆమె ప్రభావం జీవితాంతం వదలదు. నాకు తెలియకుండానే నేనేంచేసినా, ఆలోచించినా తనలాగే చేస్తాను.

సూర్యుడిలాగే అమ్మమ్మ ఏ ఒక్కరోజుకూడా పడకేయడం నేను చూడలేదు. ఈ రోజువరకూ తన కర్తవ్యం నెరవేరుస్తూనే ఉంది.

కరుణతో కూడిన చూపు, ఆప్యాయతా, అభిమానం నిండిన స్వరం, బోలెడంత ఓపిక, సహనం, ధైర్యం, చేతుల్లోశక్తి, సామర్థ్యం, నిలువెల్లా చైతన్యం అన్నీ కలిపితే అది మా అమ్మమ్మ.

అమ్మమ్మదగ్గర పసికూనగా నేను పొందిన ఆప్యాయత తిరిగి ఎన్నో ఏళ్ళ తరువాత నా శ్రీ వారి దగ్గర దొరికింది(అది వేరే కథౌతుంది).


http://ramya-ramyam.blogspot.com/2008/05/bog-post_6291.html




# అమ్మ ఎక్కడికీ వెళ్ళదు

ప్రసాదమూర్తి

తమ్ముడు తడిసిపోతున్నాడు
ధారలు ధారలుగా కురుస్తున్నాడు
అమ్మ వెళ్లిపోయిందని తల్లడిల్లిపోతున్నాడు
ఈదురుగాలికి చెల్లా చెదురవుతున్న
పిచ్చుక గూడులా
లోపల్లోపలే దిగులుదిగులుగా పిగిలిపోతున్నాడు
ఉన్నచేతుల్ని వేలాడేసుకుని
దిగులు ముగాలు పెట్టి అలా చూస్తుండగానే
అమ్మ టా టా చెప్పేసిందని
తమ్ముడు నిలువునా బీటలువారిపోతున్నాడు.

మనపిచ్చిగాని అమ్మ ఎక్కడికి వెళుతుంది?
అమ్మ మనచుట్టూనే ఉంటుంది
మనల్ని చుట్టుకునే ఉంటుంది
మన మెతుకులో మెతుకై వాతాపిజీర్ణం అంటూ
ప్రేమగా కడుపు తడుముతూనే ఉంటుంది

ఆకాశంలో ఉన్నా మనల్నిచూస్తూనే ఉంటుంది
మబ్బుల మంచెమీద కూర్చుని
మన బతుకు పంటకి కాపలా కాస్తుంది
ఏ నడి జాములోనో చుక్కల్ని వెంటేసుకొని
మన ఇళ్ళచుట్టూ రక్షణగా
వెలుగు రేఖన్ని గీసి వెళుతుంది అమ్మ

కురిసే వానజల్లులో చల్లని పిలుపు అమ్మే
విరిసే పూలనవ్వులో
మమతల మకరందం అమ్మే
మనకు తెలియదు గాని
ముత్యాలకిరణాలను కొంగునిండా నింపుకొని
మనగుమ్మాలముందు గుమ్మరించిపోయేది అమ్మే

అమ్మలేకుండా బతకడం నేర్చుకోమని
చెప్పడానికే
ఏ కొండ చాటుకో వెళ్ళి ఉంటుంది కాని
అమ్మ ఎక్కడికి వెళుతుంది?
బొమ్మలు కావాలని మారాంచేసే
మనపిల్లల కళ్లలో మెరిసింది
అమ్మ బొమ్మేకదా!

తొలిపొద్దు వెలుగులో
చిగురాకుతో ముచ్చట్లు చెప్పే
మంచుబొట్టు నీడలో
బిడ్డల్ని దీవిస్తూ
అమ్మ కదులుతూ ఉంటుంది

అమ్మ వెళ్లిపోయిందని
వాననీటికి తడిసిన మట్టిగోడలా
లోలోపలే కొంచెం కొంచెం పెళ్లలు పెళ్లలుగా
విరిగిపోతున్నాడు తమ్ముడు
కన్నీటి పొరలమధ్య కానలేకున్నాడు కాని
అమ్మ పక్కనే ఉంది కొడుకును నిలబెడుతూ
అమ్మ ఎక్కడికి వెళుతుంది?

మహా అయితే
తాను పంచిన రక్తంలోకే
తిరుగు ప్రయాణం కడుతుంది.



కవిత

# అమ్మా! నేనదృష్టవంతుణ్ణి

**ఏకాంతపు దిలీపు**



పల్లెటూరు సుఖాలను వదిలిపెట్టి
మా మంచికోసమని పట్నం వచ్చి
నువ్వే చాకలివై, కుట్టుమనిషై, పాలేరువై
పనిమనిషివై బండచాకిరి చేసావు

నీకు ఏదైనా నొప్పివచ్చిందని తెలిసినప్పుడు
నాలో ఏదో అలజడి నన్ను దహించివేస్తుంది
ఈ రెక్కలగూడు ఏమైపోతుందో అని
ఎవరైనా నీ కష్టాన్నిచూసి నిన్ను మెచ్చుకుంటుంటే
నా కుటుంబం కోసం చేస్తున్నాను,
నాకు అది ఇచ్చే సంతృప్తిచాలు అని కొట్టిపారేస్తావు
పిచ్చి అమ్మా....! నువ్వేమిచేస్తునావో నీకుతెలియదేమో
సంతృప్తికోసం చేసే త్యాగాలు అన్నా ఇన్నా!
బయటి ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు
నీకు కొడుకుగా పుట్టడం నిజంగా నా అదృష్టం అనిపిస్తుంది
మా అందమైన భవిషత్తుకోసం నువ్వు కనే చిన్న చిన్న కలలే నిన్ను నడిపిస్తాయి

కానీ అమ్మా నువ్వు నాతో పంచుకుంటున్నప్పుడు
నీతో రెట్టించి మాట్టాడతాను అన్ని కలలు ఉండకూడదని
నువ్వూ అంతే గట్టిగా వాదిస్తావు
వాదనలో మసకబారే నీ కళ్ళని చూడలేక నేను అక్కడినుండి వెళ్ళిపోతాను.
కానీ అమ్మా నీ కలలు గొంతెమ్మ కోర్కెలు కాదు.. అవి చాలా చిన్నవే
ఆ చిన్న చిన్న కోరికలు కూడా తీరకపోతే
వాటిమీద బతుకుతున్న నువ్వు తట్టులేకపోతావని నాకు భయం

ఇప్పటికే నీకు దూరంగా ఉంటున్నాను
భవిష్యత్తు ఎలావుంటుందో తెలియదు
అందుకే అంటాను
నీకంటూ ఒక వ్యక్తిగతం ఉండాలి నీకంటూ ఒక ప్రపంచం ఉండాలని

http://ekantham.blogspot.com/2008/05/bog-post_12.html

# అమ్మా! నేనదృష్టవంతుణ్ణి

ఏకాంతపు దిలీపు

కవిత



నీకెవరైనా కష్టంచేస్తే క్షమించు, సహనంతో ఉండు,
ప్రేమతో మాత్రమే ఎదుటివాళ్ళని గెలవగలవు
అని నువ్వుచెప్పేమాటలని పాటించాలని ప్రయత్నిస్తున్నప్పుడు
ఒక్కోసారి నాకు నేను బలహీనుడిగా కనబడతాను
కానీ నీ జీవితాన్ని తరచి చూస్తే నాకు ధైర్యంవస్తుంది..
నువ్వు చెప్పినట్టే ఉంటాను.

ఈ బాబుని ఇంతకుముందు ఎక్కడో చూసినట్టుంది
నీతో నాకు ఇంతకుముందే పరిచయమున్నట్టుంది
అని చాలామంది అంటుంటే నువ్వు నాకు పంచిన ప్రేమశక్తి
అందరిని నాలో పోలికలు వెతుక్కునేట్టు చేస్తుందనుకుంటాను

అస్తవ్యస్థంగా నడిచే భారతదేశం
అప్పుల ఊబిలో కూరుకుపోయిన ఈ దేశం
ఎంతోకొంత సవ్యంగా ముందుకెళ్తుంది అంటే
నీలాంటి అమ్మలవల్లే అని నా కనిపిస్తుంది

కష్టాలు కడగండ్లకు
అణువణువునా నీ కాయం కుదేలైపోతుంటేను
చిరునవ్వుతో మమ్మల్ని నీ దరికి తీసుకున్నావు
ఆ నవ్వు వెన్నెల్లో నీ ఒడిలో మేము సేదతీరుతుంటేను
నీ బాధనే మరిచావు
మా బంగారు భవిష్యత్తుకై కలలు కన్నావు
ఆ కలల స్థైర్యంతో రేపటికి ఎదురునిలిచావు
నన్ను కన్న నా అమ్మ
ఏంచేసి
నీ కన్న నీ ఋణం తీర్చుకోగలడు?



# చెత్తకుండీకీ ఓ మనసుంటే

టపా

**పూర్ణిమ**

వేసవి సాయంత్రం... సూర్యుడు తన ప్రతాపమంతా చూపించి "మళ్ళొస్తా"అంటూ పడమరలో అస్తమిస్తున్నాడు. చల్లని గాలితో పాటు, చంద్రుడూ రాబోతున్నాడు. ఇప్పటిదాకా నిర్మానుష్యంగా ఉన్న వీధి కొత్త సందడి నేర్చుకుంటుంది. ఇళ్ళకు చేరేవారితో, ఆటలాడే చిన్నారులతో యమా బిజీగా ఉంది. ఈ సందడంతా కాసేపే, ఆ తర్వాత అందరూ నిద్రకు ఉపక్రమిస్తారు. అప్పుడు మళ్ళీ ఒంటరిగా నేను.ఒంటరితనం ఒక కొత్త అందాన్ని ఇస్తుంది. ఒక అనుభూతినో ఒక ఊహనో కౌగిలించుకుంటే... ఒంటరితనం కూడా అందమే!! ఇంతకీ నేనెవరో చెప్పలేదు కదూ.. ఈ ప్రాంతానికి ఉన్న ఏకైక చెత్తకుండీని, పాష్‌గా గార్బేజ్ బిన్‌ని. రండి.. ఈ ఆహ్లాదమైన వేళ మీతో మాటా మంతి కాసేపు.

నన్నిక్కడ సుమారు ఓ పదేళ్ళ కింద అప్పటి యం.సి.హెచ్.వారు స్థాపించారు(భారీ పదమా?? పోనీ.. పెట్టారు!!) ఆతర్వాత ఓ రెండు మూడుసార్లు మరమత్తులు జరిగాయి. ఇప్పుడు మళ్ళీ రినోవేషన్ ఉందట. మేకోవర్ ఆశగా ఎదురుచూస్తున్నాను. చెత్తకుండీలు ఎలా ఉంటాయో మీకు తెలుసుకదండీ.. నేనొకచోట, చెత్త ఒకచోట!! నేనేకాక నా పరిసర ప్రాంతాలన్నీ చెత్తమయం. గాల్లో ఎగురుతూ ఉండే చెత్త.. ఆ కంపువాసనా.. ఇవ్వన్నీ మీరు సృష్టించేదే!! చెత్తడబ్బాను సరిగ్గా ఉపయోగించక నేనున్నా లేకున్నట్టే చేస్తారు మీరు. ఇప్పుడు ఏంటో గ్రేటర్ సిటీ అవుతుందటగా?? ఇప్పుడైనా ముందు చెత్తనెట్లా పాడెయ్యాలో నేర్పమని నా మాటగా మీవాళ్ళకు చెప్పండి. ఏంటాహడావిడి అక్కడ. అయ్యో!! ఎవరో ఆడుకుంటున్న పిల్లాడు కింద పడ్డట్టున్నాడు. ఓ క్షణం ఆగండి . ఏమి జరుగుతుందో తెలుసుకునివస్తాను.

పాపం పిల్లాడికి బానే తగిలింది దెబ్బ. మూతంతా రక్తంకారుతుంది. సృహాలో లేడు. ఇప్పుడే ఆసుపత్రికి తీసుకువెళుతున్నారు. వాళ్లఅమ్మ గుక్క తిప్పకుండా ఏడుస్తుంది. కన్నపేగు కదండీ అలానే ఉంటుందికదా! నాకెలా తెలుసనంటారా? చూస్తుంటే తెలియదంటారా? ఈ వీధి చివరన ఉన్న అమ్మ పెద్ద ఉద్యోగం చేస్తుందట. పొద్దున పోయి రాత్రివేళకు వస్తుంది. తన మూడేళ్ల కూతురిని వదిలి వెళ్ళాలంటే ఆ అమ్మ పాణంమీదకొస్తుంది. విడవలేక విడవలేక వెళ్తుంది ప్రతీ ఉదయం. రాత్రికాగానే ఆ అమ్మబిడ్డల కౌగిలింతలు, ముద్దులు, ముచ్చట్లు, ఆటలు.. చూడాలి అంతే!! ఇక ఆ పక్కవీధిలో ఉన్న మూడో ఇంటిలో ఉండే అమ్మ. నేను ఇక్కడకు వచ్చినప్పుడు కొత్తపెళ్ళికూతురు. చానాళ్ళు ఎదురుచూస్తేగాని సంతానం కలుగలేదు. ఎన్నినోములు, ఎన్ని వ్రతాలు ? అమ్మకావడానికి పడేవేదన అర్థమైంది. ఇక ఈ ఎదురింట్లో ఉండే అమ్మ నాకు బాగా తెలిసిన అమ్మ. మేస్త్రీపనిచేస్తారు భార్యాభర్తలిద్దరూ. ఉన్న కొంతలో పిల్లలను ఎంత చక్కగా తీరుస్తుందని. ముత్యాల్లా ఉంటారు వాళ్లు. అందులో శీను ఆమెకు పుట్టలేదు.



http://oohalanni-oosulai.blogspot.com/2008/06/bog-post_15.html

టపా

# చెత్తకుండీకీ ఓ మనసుంటే

పూర్ణిమ

వాడి అమ్మకథ వేరే.

అనుకోకుండా ఒకరోజు ఓ అమ్మాయి వచ్చింది నాదగ్గరకు. పేరు పిచ్చిది అనుకుంటా.(మీ వాళ్లు అంతా అలానే పిలిచేవారు)పొత్తిళ్లలో ఓ పసికందును పెట్టుకుని వచ్చింది. ఇక్కడేవుండేది. చెత్త ఎటూ మీరంతా బయటేవేస్తారు కనుక ఈ పిల్ల నా గదిలో ఉండేది. తనలో తను మాట్లాడుకుంటూ ఉండేది. ఎప్పుడూ ఆ పిల్లాడిచింతనే ఆమెకు. తను చెత్తలో దొరికింది తినేది. ఆ పసావాడికోసం మాత్రం వీధుల్లో తిరిగేది. అడుక్కునేది. వచ్చినదానితో ఆ పిల్లాడిని పోషించేది. ఓ రాత్రి పడుకుని ఉండగా కుక్కలన్నీ చేరాయి ఆ పసికందుమీద కన్నేసి!! బాబును కాపాడుకోవడంకోసం ఆమె కుక్కలతో పోరాడింది. బిడ్డకు ఏమీకాలేదు. ఆమెకుమాత్రం చాలా కాట్లు అయ్యాయి. ఆగాయాల్తో ఆమె కొన్నిరోజులకి చనిపోయింది. అప్పటినుంచీ ఆ బిడ్డను ఈ మేస్త్రమ్మే పెంచుకుంటుంది. మీ మానవుల్లో ఉన్న "అమ్మతనం" దగ్గరగాచూస్తేనే ఇంత ఆనందమైతే ఇక ఆ వరం పొందితే ఎంత మధురమో!!

ఆహ్లాదమైన వాతావరణంలో మాట్లాడుకుందామని భారీ, భారీ అనుభవాలను పంచుకున్నానా?? ఏంచేస్తాం ఆ పిల్లాడి దెబ్బ తగిలేసరికి మనసు అటే పోయింది. జీవులన్నిటిలో ఈ మాతృత్వం ఉంటుందట కదా.. మీరు చాలానే అదృష్టవంతులు! మాకలాంటి భాగ్యంలేదు. నాకూ ఓ అవకాశం ఉంటే మనిషిగా పుడతా. ఇవ్వన్నీ అనుభవిస్తా! నా సంగతి ఏమోగాని మీకు ఆలస్యమవుతుందేమో ఇక వెళ్ళిరండి. ఇంకెప్పుడైనా... ఏమిటిది? ఎవరిదో పసికందు ఏడుపు వినిపిస్తుంది. అయ్యో.. నావళ్ళో ఎవరో పసిపాపను వదిలేసారు. ఇంకా రక్తపు మరకలుకూడా వదలలేదు. ఎవరినైనా పిలవండి. ఈ పాపను తీసుకెళ్లమనండి. ఇక్కడే నా కళ్లముందే కుక్కలు పీక్కుతినడం నేను చూడలేను. ఇది చెత్తకుండీ అని చెప్పండి. ఇక్కడ నిజమైన చెత్తను వేమాలిగాని, మీకు నచ్చని ప్రతీది నాలో వెయ్యొద్దని చెప్పండి. నా మనసుకింత గాయం భరించే శక్తిలేదు, చూస్తూవుండలేను. ఏమీ చెయ్యలేను. ప్లీజ్... చెప్పండి... త్వరగా ఏదో ఒకటి చెయ్యండి. పాపని రక్షించండి.

---

చెత్తకుండీకి కూడా ఓ మనసు ఏడిస్తే మనల్నిచూసి అది ఎంతగా ఏడుస్తుందో అన్న ఊహకు రూపాంతరం ఈ టపా. అదృష్టం, దానికి మనసులేదు. మనకేమో 'అలవాటు' పడిపోవడమనే కవచం ఉంది. ఎంతటి విపరీతాలకైనా అలవాటు పడిపోవడం, మొద్దుకెక్కిపోవడం .. మన నైజం.